శ్రీగురుభ్యోనమః

# అచలశతకము



శ్రీమదచల పరిపూర్ణులగు

వరదా రామమూర్తిగారి ప్రియశిష్యుండగు

ముద్దిసెటి రమలాపురిచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు 500.


రాజమహేంద్రవరము:

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

1916




## యీగ్రంథమునకు చందా యిచ్చినవారి

### — పేర్లు —

లగడపాటి వెంకటనాగభూషణంగారు. దుమ్ముగూడెం

మాదిరెడ్డి రంగారావునాయుడుగారు. డిటో

మాటూరి కాళయ్యగారు. డిటో

కొనగళ్ల సూర్యనారాయణగారు. డిటో

శివగెడ్డెశీలయ్యగారు. డిటో

దవులూరిఅప్పలస్వామి. డిటో

ముద్దినీడి హనుమంతు. డిటో

చెండిగ బ్రహ్మయ్యగారు. డిటో

నందినారాయణస్వామిగారు. డిటో

ముద్దినీడి జమలాపురిగారి ప్రియశిష్యుండగు

మాన్యం చినలక్ష్మయ్యగారు, దుమ్ముగూడెం



శ్రీసద్గురవేనమః

# అచలశతకము

---

కం॥ శ్రీశా వరదా రామా
యీశా నిహపరముయీశ సిరసపంచా
కోశాతీత జగన్ని
వేశా నే మిమ్ము దలతు వేమర కెపుడున్॥౧॥

కం॥ శ్రీశ్రీనివాససద్గురు
నాశ్రితజనరక్షకాయ ననుబ్రోవుమురా
శ్రీకారము గామిము
సౌస్రష్టిగదలచె దాను శతవిధములనే॥౨॥

కం॥ శ్రీకారము గురుకరుణని
శ్రీకారము బోధవిన్న చిత్తము లలరన్
శ్రీకారమె గురుపదములు
శ్రీకారము మదినిడలప శ్రీకరమొలగన్॥౩॥

కం॥ శ్రీకారము లోకాదినె
శ్రీకారము లోకమంత శృంగారంబై
శ్రీకారమె లోలతయీ
శ్రీకారమె రామయార్య శేఖరు వ్రాతున్॥౪॥

కం॥ శ్రీకారము సత్యంబని
శ్రీకారము నిత్యమనుచు శ్రుతులన్ వినితా
శ్రీకారము గురుచేత
శ్రీకారము వానికొసగు చింతలు దీరన్ ॥౫॥

కం॥ శ్రీకారము విశ్వాదిని
ప్రకటముగ నిండియుండు బహుదోషములన్
యేకాలము యెరుగనియా
శ్రీకారము వప్పవ్రాతు శ్రీగురుపదముల్ ॥౬॥

కం॥ శ్రీకారము గురువన్నదె
శ్రీకారము నరులువిన్న శ్రీధరులన్నా
శ్రీకారము చిరకాలము
శ్రీకారము నచలమన్న శ్రీగురు దెలుపన్ ॥౭॥

కం॥ శ్రీకారము నచలంబు ని
రాకారము లేదుగాన రాశ్యముగురుచే
సాకారము లేదు చూడ
శ్రీకారము శబ్దమనక చెలువుగ వినుడీ ॥౮॥

కం॥ శ్రీకారము శబ్దాదిని
యేకాలము సూదిమోప నెడమే లేకన్
శ్రీకారము గలదంతట
ప్రాకారము గోపురములు ప్రస్తుతిలేకన్ ॥౯॥

కం॥ ఇదియే నెచ్చట జూచిన
నిదియే గనుపించుచుండు నిఖిలముతానై

నిదియే శ్రీకారముగా
నిదియే జూపించుగురుడు నిశ్చయమరయన్॥౧౦॥
కం॥ వరదారాముల చరితము
పరధారల గోరినట్టి పాతకిచయముల్
సరుదానురమాపట ధగ
ఖరదూషణఖండనంబు గాదావిశ్వం॥౧౧॥
కం॥ ప్రీతిగ గురుపదముల ప్రి
ఖ్యాతిని యీలోకమెల్ల ఘనముగ దెలుపన్
నూతనమగు శతకంబును
భూతలమున జేసినాడ పుణ్యులె వినుడీ॥౧౨॥
కం॥ పెద్దలకు యేను దాసుడ
దిద్దుడినాతప్పులన్ని దీను డనుచున్
కద్దిదిజగముల సంతట
వద్దికతో చదువువారు వర్ధిలుకొరకై॥౧౩॥
కం॥ వర్ధిలకేయను మీరే
శ్రద్ధతో నాతప్పులన్ని క్షమియింపదగున్
మర్ధశ వాంఛావిషయ
మ్మర్థితమము రక్షకాయ మాగురుమూర్తీ॥౧౪॥
కం॥ తప్పులు గలిగిన వినుడీ
ముప్పదిరెండక్షరములు మునుపే తప్పుల్
యెప్పుడు తప్పులు నెరుగక
వప్పెడి పరిపూర్ణమదుగా వరదారామా॥౧౫॥

కం॥ గొప్పగ కొద్దిగ చదివిన
తప్పులు గలిగుండు వినుము తాతలనాడే
యొప్పగు చదువులుగాని దె
జెప్పెడు గురుచేత విన్న జెల్లును తప్పుల్॥ ౧౬॥

కం॥ చందంబులు చదివినమది
మందంబులు బోవుటెట్లు మహాకవులారా
ఛందంబు చదివి చంద్రుడు
ముందుగ గురుశాపమందె ముదమున వినుడీ॥ ౧౭॥

కం॥ యాంద్రింబును మొదలగు దే
వేంద్రుడును చదివి చాలవెర్ఱంగాంబై యో
గీంద్రిసతిని నంటడె
యాంద్రింబను చదువులేల యోకవులారా॥ ౧౮॥

కం॥ యెతిగణప్రాసలు చదివిన
మతిమంధతపోవుటెట్లు మహాకవులారా
శతస్త్రీలను పెండ్లాడిన
మతిమంతుడు గైముకాడ మరిమరి వినుడీ॥ ౧౯॥

కం॥ లక్షణశాస్త్రంబను చను
లక్షణమంత్రింబులనుచు లక్షలకొలదిన్
నక్షింత్రలెన్ని వేసిన
లక్షణస్త్రీయగు నవిధవలావణ్యముగ॥ ౨౦॥

కం॥ పందెంబు వేసి జెప్పెద
చందస్సును చదువనేల చయ్యానగురుచే

నందనుడై వుండినగా
మందిశీ చందంబులేల మహాకవులారా॥ ౨౧॥

క॥ చదువనగా చదువౌనా
చదువే గురుపాదపూజ సాటికియగునా
చదువే గురుబోధలువిని
చదువే చదువంగవచ్చు సాక్షియులేకన్॥ ౨౨॥

క॥ లక్షలు తప్పలు గలిగిన
లక్షణములు చదువులేల లక్ష్యముచేతన్
లక్షశాస్త్రములెల్ల వి
లక్షణుడే చేయలేదా లజ్జయులేకన్॥ ౨౩॥

క॥ మీరెంత చదివినేనియు
కోరికదీరంగ గురుని కనుగొనలేకన్
చీరెంత కోరికట్టిన
నారీమణి గుణములేక నాణ్యంబగునా॥ ౨౪॥

క॥ మోక్షము జూపెదననుచును
దాక్షిణ్యము దలచినట్లు దబ్బరిమాటల్
మాక్షికము యెంతయెగిరిన
యాక్షకోరికి సాటియగునె యాచదువులచే॥ ౨౫॥

క॥ దీక్షాసహితులు కొందరు
మోక్షము నేనెరుగునంచు మోసముజేయన్
గోక్షీరపానమెరుగునె
యాక్షీగసమీపమందు యాపిరుదుండన్ ॥ ౨౬॥

కం॥ వినిమీరు నిజముగనుగొని
మునిమానస సదయులార ముదముదలిర్పన్
వినిగన్నది లేదనుచును
మనవిని వినుమనుచు వ్రాతు మహాకవులారా॥౨౭॥

కం॥ మోక్షంబని కొందరు యప
రోక్షంబని కొందరనుచు రూఢేఁ దరుసం
ప్రోక్షంబును దగిలినచో
మోక్షంబని ముచుల్ దెలియు ముఖ్యంబఁదాన్॥౨౮॥

కం॥ లక్షలకులక్ష మొలచిన
లక్షోంకరలుండ యిక్షులావును సన్నం
బక్షింప వంకరుంచునా
లక్షణ మటువంటిదనుచు లరయుడి మీరల్॥౨౯॥

కం॥ అందంబులేని కొలనులొ
సుందరముగు కలువలుండ శుభముసు వినుడీ
నందంబులేని మానిచె
మందరధరుడెరిగె బోధమహాకవులారా॥౩౦॥

కం॥ గురునందన కందంబులు
మరిమందికి నందమవ్వన మాయలచేతన్
ఖరమందున శ్రీచందన
ష్కరమందిన మందికందు వాంచలుదీరున్॥౩౧॥

కం॥ నాలుగు ద్వాదశమంబులు
వాలుగ రెండష్టమీలు వరసతోవ్రాయన్

చాలును కందముకొరువది
నాలుగు లఘువాక్షరములె నాకందముకుర్‌ ॥3౨॥

కం॥ ఒకలఘువు దక్కువాయన
నికకందము పనికిరాదు నీరసమగునా
నకలంకమైన చరితము
సకలంబును నిండియుంచు సద్గురులెరుగుర్‌ ॥33॥

కం॥ చదివిన గలదా ముక్తిటు
వదరంగా గలదె ముక్తి వసుమతిలోనర్‌
పదపడి గురునిటుజేరిన
ముదమందుచు ముక్తిపదము ముఖ్యమునొరుకుర్‌ ॥

కం॥ అక్షరము లేకనున్నది
పక్షియును మృగంబుగాదు ప్రజలును గాకర్‌
విక్షేపశక్తిగానిదె
నిక్షేపము గురునిదెలియు నీకిటుదెలుపుర్‌ ॥3౪॥

కం॥ అందంబుల కందంబుల
చందంబుల చదువులమరచయ్యనమీరర్‌
సుందరములె సంధించియు
మందంబులు బాపజేయు మాగురుమూర్తి ॥3౬॥

కం॥ చందంబు జూచినవ్వీన
అందంబును దక్కువైన హాగురువర్యా
నందంబే యెరుగనియా
మందికి యానందమవున మాకందములర్‌ ॥3౭॥

కం॥ నూతన గ్రంథంబనక స
నాతన బ్రహ్మమనుచు నాఁగురుదెలిపెన్
నాతీరుగ దెలిపెద విని
ఏతెంచుడి గురునికడకు నేజయమందున్॥౩౮॥

కం॥ ప్రీతిగలవారె వినుడీ
పాతకహరణంబులవును పావనులగుచున్
శీతలమగు హృదయుంబై
నీతికి వెలలేకయుందు నిజమునియందున్॥౩౯॥

కం॥ వరరామయోగి సత్కృప
దరిజేరిన దాసులకును నాయదొరుకున్
పరిపరివిధములగా నదె
ధరసాధన లేకనుందు ధన్యులజేయున్॥౪౦॥

కం॥ జనులార గురుసన్నిధి
జనుదెంచుకి మీకు గొప్పజయమును దొరుకున్
జననము మరణము లేనిది
యనిమిషములోన జూపు నచలంబంతెన్॥౪౧॥

కం॥ తనుదానే గనుటె యిలగు
జనకుడుఁజేసినట్టి సంతు జనన బగునా
వని తెంత తపముజేసిన
తనయులు తనకెట్లుగలుగు తాతలతరమా॥౪౨॥

కం॥ విను భర్త లేని చెలియకు
తనయులు నెటువలెను గలుగు తద్విధమొకగన్

చనుదెంచుమడి గురుకటకును
వినుపించును బోధవిగాకు వివరముదెలియన్ ॥౪౩॥

కం॥ మానవులయి జన్మించియు
దానవులయి దిరుగనేల దారియు గురుసం
తానముతై దిరిగిన యా
మానవులే యెరుగు వినుడీ మాపద్యములన్ ॥౪౪॥

కం॥ యీషణ త్రియములు హరమా
భూషణదూషణలు లేని బోధయు గురుసం
భాషణ విన్నను వారే
దోషమునను చెందబోరు తోవిధమిాకున్ ॥౪౫॥

కం॥ నరజన్మ మెత్తినందుకు
గురుపదములు బట్టవలయు కోరికదీరన్
నరజన్మకు సఫలమాయిదె
పరమమెడి భ్రాంతిలేక ప్రిబలుచునుండన్ ॥౪౬॥

కం॥ పరవరగురువులు యని
కోరి వెదకంగవలయు గోరికదీరన్
మిారీ యిహమును పరమును
సూరీవర కొమరలగుచు చెలగుచువినుడీ॥౪౭॥

కం॥ మిారే యెంతటిధన్యులో
సూరీవర పాదపూజ సుగుణములేకన్
యేరీతి ధన్యులవుదురో
నారీతిని నాకుదెలుపు నానార్థములన్ ॥౪౮॥

కం॥ దీక్షలెసుమి పనులెల్లను
దీక్షలో లేనట్టి పనులు దేనిచె గలుగున్
దీక్షవహింంచియు జేసిన
మోక్షంబన వెర్రిగాద మూహావికారం॥౪౯॥

కం॥ దీక్షలె యోగములన్నను
దీక్షలె మరిభోగమన్న దీక్షలె చదువుల్
దీక్షాధీసుని ఎరిగిన
మోక్షబ్రాంతనుచు దెలుసు మోదముతోడన్॥౫౦॥

కం॥ చీనాచదువులు చదివియు
మేనాలో యెక్కినంత మోక్షముగలదే
గానా గురు టు జేరిన
తానా మోక్షంబుబడయు తద్విదమరుదున్॥౫౧॥

కం॥ సరసముగ చదివినామని
వరషంబునుగురియునట్లు వాదించినవో
పరుసముసోకక యినుమే
వరసన బంగారమాను ః సుమతిలోనన్॥౫౨॥

కం॥ సరసముగ చదువనేర్చిన
గురుపదములు బట్టెనంత గుణములుహారమా
పరుసముసోకిన ఇనుమే
కరణిగనుండవలెనొ కనుగొని మీరున్॥౫౩॥

కం॥ సలలిత హృదయులారస
విలసిత గురుపాదపూజ వేడుకచేశన్

చలముచలము గనిపించియు
కలికల్మష నాశనంబు గనుమీగురుచే॥౫౪॥

కం॥ చాలించుమి చదువుల్తుకల
యాలించుమి బోధచెవుల యోచనలేలా
లాలించుమి గురుపదములు
పాలించును గురుడుమనల పాపములేక॥౫౫॥

కం॥ యిలమీదను ఫలముందని
తలక్రిందుగ తపముజేయ ధన్యుంశగునా
కలయాదలి ఫలములు గని
యిలయందున నుడిచినట్లు సీఫలమందున్॥౫౬॥

కం॥ యేలా చదువుల గోలా
యీలా చదువంగమేల యీగురులీలా
మీలో కించలు చాలా
కీలే తెలియంగ చదువు కింకరులై తే॥౫౭॥

కం॥ యీలా చదువగ నేలా
కాలాకాలంబు లేసి కలిమిది గురుచే
చాలా చదివిన చాలా
మేలే వాలనుమ దెలియు మేదినియందున్॥౫౮॥

కం॥ చాలా చదువులు ఏలా
చాలా గురుబోధలోల సాంగముపాలా
కాలాకాల మదేలా
బేలా గురుపాదసీల చదువగనేలా॥౫౯॥

కం॥ కలలోపలి చదువులు సుమి
కలలోపలి విద్యలెల్ల కలిమికినగునా
కల మేలుకైన షిమ్మట
కలలోపలి నిజములన్ని కల్లలుదోచున్ ॥౬౦॥

కం॥ దారువును జూచినంతలో
చోరుండని భ్రమసినట్లు చిత్రపుజగమున్
వీరుండై జూచినయా
దారువు మొద్దనవిశమము ధాత్రిని దెలియన్ ॥౬౧॥

కం॥ ఏలా యీజన్మకు సం
సీలము కలిముండెనేని శ్రీగురుచేతన్
జాలునపడి శీలముయా
కీలే మొదలూడిపోవు కింకరుడైనన్ ॥౬౨॥

కం॥ వందనమని గురుసామికి
చందనమున పాదపూజ సాకల్యమునన్
సుందరమని బోధనువిని
నందనులై యున్న చాలు నాగురుపంచన్ ॥౬౩॥

కం॥ అనుమానమన్న విశ్వమె
పెనుచీకటియందు త్రాడు పామని తోయ్యన్
గనుమాయ విశ్వమిట్లని
మనుడీ గురుపాదచెంత మహనీయులారా॥౬౪॥

కం॥ ప్రాణాయామజయంబని
కాననమున దిరిగినంత గనునా మోక్షం

తానాపూర్ణంబెరుగక
ప్రాణాయామంబు తనకు ప్రజ్ఞలు దోచెన్ ||౬౫||

క|| ప్రాణాయామజయంబే
తానా భావంబునరుచు తాగురుచేతన్
గానాపూర్ణంబెరిగిన
ప్రాణాయామంబు దనకు ప్రజ్ఞలునగునా ||౬౬||

క|| కలలోపలి యోగంబులు
కలదోచక యోగమేది గనుమిది గురుచే
కలబాసిన విధు సూచన
యిలదోచిన కలలుగలవ నీరెన్నొకటే ||౬౭||

క|| శ్రీగురు కరుణారసభర
సాగరమున నోలలాడు సద్గురు చేతన్
యోగములు లేక క్షణములో
బాగుగ వినవచ్చు పూర్ణభావంబరయన్ ||౬౮||

క|| వేగమె చనుడీ మీరలు
జాగేలను బోధవినుడు జయమునుగనుడి
జోగులకు దొరకచేరక
భోగులకిది చెంతనందు భాగ్యంబందున్ ||౬౯||

క|| సిగ్గా గురునకు మొక్కను
యెగ్గా గురుపాదతీర్థయోగ్యత విడన్
తగ్గా గురుసేవను దిని
వగ్గా యిలబోధలన్ని వాంఛలుదీరన్ ||౭౦||

కం॥ కాంచనమేలా మిాకును
లాంచనమని గురుని పూజలాలితమరయా
వాంచలుదీఱయు మనమతి
చాంచల్యము నణగువిన్న సాధువులారా॥౨౧॥
కం॥ జలమందలి జలచరములు
వలయందలి జిక్కినట్లు వసుమతిలోన
కలయందలి కాంక్షకుయా
యిలయందలి మోక్షమనుట హీనులుసుమిా॥౨౨॥
కం॥ గురుధ్యాన్న మఱచిన యా
నరకము యెమపురికి బోవు నతివేగము న
నరుడెంచరె పునరావృత్తి
మరచుని సురబోధనిట్లు మానవులైతే॥23॥
కం॥ గురుమూర్తి ధ్యానమెప్పును
మరువయున్నట్టి వారి మహిమనుగనరె
హరిహరవిధికిన్నెర ని
జరులైనను వారితోటి సరిరారంట॥౨౪॥
కం॥ గురుమూర్తిని మరువని యా
నరులే మాయాబ్ధిగడచినట్టి ధన్యులా
గురుమూర్తిని దలచని
హరిహరులైనను ప్రకృతియందు మునగరే॥౨౫॥
కం॥ గురుడొసగిన కందములివి
మరుపించును దివ్యమైన మధురములెల్ల

సరసులకు గాక మూఢుల
కెరుకగు నా వాధు సగోష్ఠిల నెరుగునె కపుల్॥౭౬॥

క॥ గురునొసగిన ద్వాదసి నిహా
పరములు నిండైనయుండు భావములేకన్
నరుడెంచరె గురుసన్నిధి
మరుగని తెరతీసి జూపుమాటలు లేకన్॥౭౭॥

క॥ గురు కరుణలేక యెవ్వరి
తరమా పరిపూర్ణమబ్బ ధన్యుండైనన్
గురుచెంత చేరి విన్నను
పరిపూర్ణం బనగనొప్పు ప్రికృతిలేకన్॥౭౮॥

క॥ గురు శేవ జేయువారికి
తరుగిరుగులు లేకయుండు తత్వములేకన్
గురు శేవ జేయకున్నను
తరుగిర్గులు తప్పబోవు తత్వముతానై॥౭౯॥

క॥ సురలన్నను నరులన్నను
హరిహర బ్రిహ్మాండమన్న ననంతములనన్
గిరులన్నను తరులన్నను
పరమన్నను శూన్యమేను భ్రిమయిదిగాదా॥౮౦॥

క॥ పరమొందని సురలెన్నరి
పరమొందని నరులుయెన్నె పరులోనరుల్లో
వరమందిన సురలెవ్వరు
నిరువొందగ జెప్పవలెను యీసభలోనన్॥౮౧॥

కం॥ సురతనువులు నిత్యంబని
మొరపెట్టిరి నరులు చాలమోదముతోడన్
సురలే నిత్యంబైనను
మరణంబును మీరనలదె మహనీయులారా॥౮౨॥

కం॥ మరణము జెందెదమనుచును
సురలందరు సుధముత్రాగ సుగుణంబౌనా
సురలే తనువులుగానా
మరణంబును దప్పనెవరు మరిమరి వినుడీ॥౮౩॥

కం॥ సురలెవ్వరు ధరమీదను
మరణంబును మారినారొ మహాత్ములెజెప్పన్
హరిరుద్రాదుల గాంచి,
సురలెవ్వరు నరులుగాంచె సువ్రతులారా॥౮౪॥

కం॥ భూతమ్ములైదనసురలే
భూతములైదనంగ నరులు భూమీశ్వరులుం
భూతములైదనహరిహర
భూతములైదనగ బ్రహ్మ భూతలమందున్॥౮౫॥

కం॥ తనువాభూతములైదును
మనువా భూతంబులైదు మరిమరి దెలుపన్
తనువే భూతములంటివె
తనుమనువును శూన్యమేను తాతలనాడే॥౮౬॥

కం॥ భూతములైదెటు జేసెనొ
భూతంబుల జీవమేదొ భువినిటు జెప్పన్

భూతాజీవాధారము
భూతాజీవముల జీవ భూతముగలదే ||౮౭||

కం|| భూతంబని యాకాశము
భూతంబులు వాయువగ్ని భూమియు సహగా
భూతంబునీరుగావున
భూతంబుల దాతగలడె భువినిటుజెప్పన్ ||౮౮||

కం|| గలడాగురుసరిదైవము
గలడా గురుకన్న పెద్ద గాంచినవారున్
గలడాముల్లోకము గన
గలడాగురుమూర్తియనుచు గాంచుమిబైలా ||౮౯||

కం|| శరణనుడీ గురువినిమిము
మరణంబును మీరినట్టి మార్గముజూపన్
పరధర్మకామమోక్ష
పరిహారము జేయుగురుడె పావనులారా ||౯౦||

కం|| గురుమూర్తికిదాసుడనని
నరులెవ్వరు దలచుచుందు నతడెదేముఁడా
గురుమూర్తినిగననేరని
సురవరుడును నరునికంటె జూడనధముఁడౌ ||౯౧||

కం|| నీవేబ్రహ్మంబువినరా
భావంబున నమ్మమనుచు ప్రజ్ఞలుపలుకన్
ఏవిలిదన్నునివేచే
నేవిధమునపండవచ్చు నేమనవచ్చున్ ||౯౨||

కం॥ నీవేబ్రహ్మము వినుమని
భావంబున నమ్మమనుచు భావమదేమీ
నీవును తనువును వేరే
గావనిమది దెలియరెండు గనగానొకటే ॥౯౩॥

కం॥ శతవరుషంబులు చదివిన
మతినిలకడజేయుటకును మరివొకటె దీ
మతినుదరెడి గతిదెలిపిన
యెతిభాగ్యము యేమనందు యిమ్మహినందున్ ॥౯౪॥

కం॥ అలమెక్కడో జలమెక్కడో
యిలయెక్కడ కలలుగలవొ నిదిగురుచేతన్
కలదెలసిన బైలు మేలగు
కలకాలము కలలులేని కలిమిదియందున్ ॥౯౫॥

కం॥ తనుతానేకనుగొనుటే
యనుమాటెప్పటికికల్ల లనుచు దెలియుడీ
తనకలులవెలుగుతేజము
తనకాయద్దంబులేక తరమాతెలియన్ ॥౯౬॥

కం॥ నరులైతే దెలుసును వా
నరులైతేనెట్లుదెలుసునా గురుపదముల్
హరులైతే దెలుసును వా
నరులైతేనెట్లుదెలుసు కల్లయునిజముల్ ॥౯౭॥

కం॥ కనకాభరణములను యిల
వనితలు ధరియింతురిగాని వసుమతిలోనన్

కోణతముగట్టిన శునకము
కనకము తానెట్లు దెలుసు కంగున మొరగున్ ॥౯౮॥

కం॥ ఏలాపలుకులు వినుడీ
పాలాజలమందుగలుప పావపుజగముల్
ఏలా బయిలునగలయును
చాలించుమి చదువులన్ని చనిగురుకడకున్ ॥౯౯॥

కం॥ చాలాచదువులు విను ము
త్యాలా పచ్చలనుచు దారముగుచ్చన్
లీలాదలపోయుటకును
లీలాగురునిట్లుజేరి వింటే దెలుసున్ ॥౧౦౦॥

కం॥ గానాగురునిటు దెలసిన
తానును తనతను ప్రియనెడి తప్పులు దొలగున్
తానాదర్పణ మెరగక
శ్వానముపలెజూడుమన్న సభలో ప్రన్నన్ ॥౧౦౧॥

కం॥ కనుమనుచు జెప్పువాడును
కనువాడును గన్నవాడు కనపడువాడున్
మనుపెట్లో ధరయుందన
గను కేవుళ్ళక్కజగము గననేముందీ ॥౧౦౨॥

కం॥ వరకొండపల్లినిలయుడ
పరదారామార్యునంఘ్రి వనజములనిశం
మరువక ధ్యానింపుచు నీ
కరణిగ రచియించినాడ కందశతకమున్

కం॥ ఘనముద్దినీడికుల భూ
షణుడగు శ్రీపకీరాఖ్య సద్గుణనిధికిన్
అనఘ మహాలక్ష్మాంబకు
తనయుడరంగాహ్వయునకు తమ్ముడనెలమిన్ ॥౧౦౪॥

కం॥ జమలాపురి దాసుండని
సుమతులచే బిలువబడిన సుజనమిత్రుడన్
విమలరామాఖ్యగురుపద
కమలంబుల కర్పణంబుగా రచించితిన్ ॥౧౦౫॥

కం॥ చిరగుమ్మడవల్లికులా
భరణుండును యల్లమహాప్రభు శిష్యుండును
వరబంగార్దాసకవీ
శ్వరుండిది సన్గారవించి సవరణజేసెన్ ॥౧౦౬॥

కం॥ మరియు నిదిగాంచు పెద్దలు
కరుణను నాతప్పులన్ని క్షమియింపదగున్
గురునామామృతమనిశము
సురుశిరమతి గోలువాడ సుకవిన్గానూ॥౧౦౭॥

కం॥ ఇదివ్రాసిన చదివిన విని
ముదమందిన యచ్చుకూర్చి ముద్రించినయా
సదయుల నెల్లవిధంబుల
కొదువేమియు లేక బ్రోచుగురుమూర్తిదగన్ ॥౧౦౮॥

కం॥ వందన ముగురువరేణ్యా
వందనమిదె భక్తహృదయ వనజనివాసా

వాదనము నిర్వికల్పా
వందనము నిరహానిగమ వందితచరితా ॥౧౨౯॥

కం॥ మంగళము రామగురువర
మంగళమిదె పావనాత్మ మహితవిలాసా
మంగళము దాసపోషక
మంగళము గ్గానుముసర్వ మంగళప్రిదా ॥౧౩౦॥

—పంచపాదగీతి—

వసుధలో శాలివాహనశక వత్సరములు
రంధ్రకరదంతి శశిసంఖ్య రహ్యమగును
జనప్లవంగాఖ్యవర్షమై శాఖమాసకృష్ణయేకాదశిసురగురు వార
మునకు సంపూర్తియయ్యె సన్మోదమగను ॥మంగళం॥

—గురుశిష్య సంభాషణ—

వ॥ అయ్యా గురువర్యా యీ సంసారమును చూడ యమకూపమువలె కనబడుచున్నది. వేరె యెచ్చటనో యున్న దని కొందరు చెప్పెదురుగాని నామనస్సుకు యీ ప్రపంచకములో జరిగే పనులు యమకూపమువలెనే యున్నది దీనిని తప్పించుకునే యుపాయము తెలియజెప్పుము.

బిడ్డా ! చెప్పెదను వినుము. సంసారమును విడిచిపెట్టగూ

డదు. సంసారములోని వుంటి యీ బ్రహ్మాండము యావత్తు సూదిమోప సందులేకను నిండియున్న బట్టబయలైన భగవంతుని గురుముఖముగా చూచితే వారికి సాటెవ్వరు లేరని వేదములో చెప్పియున్నది.

అయ్యా ! అట్టి మహానుభావుని నాకు చూపించి నన్ను ధన్యుచేయ వేడెదను.

శిష్యా యిదుగో షోడశాక్షరీమంత్రమున్ను, ద్వాదశాక్షరీమంత్రమున్ను, యివిరెండును నీకుఁజెప్పెద. వీటిని పఠించి జన్మరాహిత్యమును గమ్ము,

అయ్యా ! యిది నాకు దృఢమయినదిగాని యీ రెండు మంత్రములను మీరేచెప్పడమూ లేక ముందు యీమంత్రములను జపించి తరించినవారు గలరా వచింపుడు.

బిడ్డా ! వినుము. యీశ్వరుండు విష్ణుయు, బ్రహ్మయున్నూ యీమంత్రములచేతనే తరించిరి.

అయ్యా యింకయెవరో వచియింపుడు.

నారద, వసిష్ఠ, గౌతమ, జమదగ్ని, పరశురామ, వాల్మీక, మాండవ్య, మృకండ, మార్కండేయ, ప్రహ్లాద, తుంబుర, పుండరీక, యక్ష, కిన్నెర, కింపురుష, గంధర్వాదులున్నూ రఘుమహారాజు, అంబరీష, దూర్వాస, దశరథ, శ్రీరామ, లక్ష్మణ, జనక, విశ్వామిత్ర, శిబి, శ్రీశుక, త్రిశంక, హరిశ్చంద్ర, నల, పరాశర, భీష్మ, వ్యాస, ద్రోణ, కృప, అశ్వద్ధామ, ధృతరాష్ట్ర, పాండురాజు, విదుర, ధర్మజ, కృష్ణ కుచేలులిద్దరున్నూ

సాందీపునివద్ద నెఱింగినవారు. అర్జున, పరీక్షిత్తు, జనమేజయు, సారంగధర, మొదలయినవారు యీమంత్రములుచేతనే ముక్తిని చెందిరి అని పెద్దలు చెప్పగా విని నీకు చెప్పితిని.

అయ్యా ! వీరు ముందు జరిగిన మూడుయుగములవారు అని సెలవిచ్చియున్నారు యీకలియుగమునందు గలవారు యెవరో వచింపుము.

ముందు మనుబ్రహ్మ అయిదువేదములు గలవాడు. వారివద్దనే వ్యాసులవారు అయిదువేదములున్నూ నేర్చుకున్నా రని చిత్తూరుజిల్లాలో చెప్పియున్నది. శిష్యా నీ వడిగినమాటకు చెప్పెదను వినుము. వేమన్నగారు, కాళిదాసుగారు, రామలింగం గారు, కబీరుదాసుగారు, కమాల్‌దాసుగారు, పెద్దదాసుగారు, పురందరదాసుగారు, సక్కుబాయి, పీర్‌దాసుగారు, బంగార్‌దాసుగారు, మొదలయిన యింకా అనేకమంది మహాత్ములు యీ భూలోకమందు కలరు.

అయ్యా యింతవరకు నాకు దృఢమయినది. గాని పంచ భూతముల వివరము దెల్పుము.

శిష్యా ! వినుము. జలము, పృథివి, ఆకాశము, అగ్ని, వాయువు, యీయైదున్నూ భూతపంచకము. యివి ప్రతిజీవుని యందు నున్నవి. యీభూతములే మెరుకయని పేరు. యీమె రుకతోనె పరిపూర్ణమును గ్రహించి తరువాతను మెరుకను పద

అయ్యా ! యింతవరకు నాకు దృఢమయినది గాని మన యింగ్లీషుదొరతనమువారు యేసుయనియును, మరహిందువులు వాసుయనియును, మహమ్మదీయులు అల్లాయనియును, యిట్లు యనుచున్నారు. యిందులో యేది నిజము స్వామి.

బిడ్డా ! బంగారము వొక్కటే. నగలు వేరువేరు. గనుక బట్టబయలైన భగవంతుడు సర్వజీవులలోను నిండియున్నాడు. గనుక వారివారి మతాచారములనుబట్టి వ్రాసినారేగాని దేవుడు వ్రాయలేదు.

అయ్యా ! మీరు చెప్పిన వాక్యములు నాకు దృఢమైనవి యేలాగున అనగా ప్రహ్లాదుడు చెప్పిన మాటకున్నూ, వేమన్న గారుచెప్పిన వాక్యములకున్నూ మీరు చూపించిన పరిపూర్ణము కున్నూ సరిగానె వున్నది. గురువాక్యం శాస్త్రం దృష్టంఅను మనోనీతికి సరిగానెయున్నది.

వరదా రామమూర్తి గారి ప్రియశిష్యుడు

ముద్దినీడి జమలాపురి వీరి ప్రియశిష్యులు

1 మాన్యం చినలక్ష్మయ్య దుమ్మగూడెం.

2 బాడిశె నరసింహ్వం కొండపల్లి.

3 కేసన వీరయ్య బెజవాడ.

విమర, ధర్మజ, కృష్ణ కుచేలులిద్దరున్నూ